సంపుటము 4]  ఆగస్టు 1917  [సంచిక 2

# బాలమిత్ర



## మంచి తల్లియొక్క ప్రేరేపణ

ఒక సబ్బాతుదినమున పడుచువా రెనమండుగురు చీట్ల పేకలబట్టుకొని, సారాయిబుడ్ల జేబులనుంచుకొని, విశ్రాంతి దినారాధననెల్ల నిర్లక్ష్యపెట్టి, వారి యూరిచెంత

నున్న యొక బయలునందు తమ ఉదయకాలమును గడుప బయలుదేరి వెళ్లుచుండిరి. వారందరొక క్రైస్తవ కాలేజిలో జదువుచున్నవారు. వారత్యంత కులాసతో హాస్యపుమాటల నాడుకొనుచు బోవుచుండ వారిమార్గమందుండిన యొక చిన్న పల్లెటూరి గుడి గంట మ్రోగ నారంభించెను. దాని విని నంతనే వారిలో నొకడగు ప్రసాదరావు తటాలున నాగి తన జతగానితో "నే నా గుడికి తప్పక పోవలయును. కావున మీతో నీదినమున రాలేను. నన్ను క్షమింపుడు" అనెను. ఆ మాటలకు వారిలో నొకబాలు డాశ్చర్యపడి కడమ వారినందరిని జీర, వారందరువచ్చి ప్రసాదమును జుట్టు కొనిరి. "నీ పిచ్చిని మేము వదిలించెదము రారమ్ము" అనుచు వారతని నీళ్లలో ముంచి హింసించుటకు సమకట్టిరి. వారి యుద్దేశము నెరిగిన ప్రసాదరావు "హితులారా! నాదొక్క మనవి. పిమ్మట మీరు నన్నేమిచేసినను పర్వాలేదుగాని నా మాటలమాత్రము శాంతముగ నాలింపుడు" యనెను. వారును యతడేమి జెప్పునో యని నిశ్శబ్దముగ నూరకుండిరి. అప్పుడు అత డిట్లు చెప్పసాగెను. "మా యూరనున్న బడిలో నే నుండగా మా ఉపాధ్యాయునికి నన్ను కాలేజికి పంపవలయునను కోరికబుట్టెనుగాని మేము పేదవారమై యుండినందున యా కోరిక కొనసాగదయ్యె. అదియునుగాక

రోగపీడితయై మిక్కిలి బలహీనురాలుగా నున్న నా తల్లియు నన్ను విడువ సాహసించదయ్యె. ఏలయన, నేనే యామెకు కనిష్ఠపుత్రుడనై యుంటిని. కొన్నియేండ్లు గడచినవెనుక నా తల్లి నన్ను విడువ సాహసించెను. మా ఉపాధ్యాయుడును స్కాలర్ షిప్ మీద నన్నిక్కడి కంపించుమార్గమును గనుగొనెను. ఐనను మా యూరు యిక్కడనున్న కాలేజి కతిదూరమున నున్నందున నేను మధ్యలో యింటికి బోకుండునట్లును, చదువంతయు ముగించినపిమ్మట నే వెళ్లునట్లును నా తండ్రి యేర్పాటుచేసెను. మంచముపట్టియున్న నా ప్రియతల్లి కడు కష్టముగ నున్నను నా మేలుకొఱకు నన్ను విడువదలచి, చివరిదినమున నన్ను తనదగ్గరకు పిలిపించి యిట్లనియె. “కుమారా! నేను నిన్నెంత ప్రేమించుచున్నానో నాకుగాక మరెవరికి తెలియదు. నీవును గ్రహింపజాలవు. నిన్ను నేను మరల జూతుననుట వట్టిమాట. పరమున నే నిన్ను మరల కలసికొనుట. కావున నా చివరిమాటల నాలించుము. దేవుని ప్రేమించి ఆయనకు భయపడుము. సబ్బాతును మీరకుము. ప్రతివిశ్రాంతిదినము ఉదయము 10 మొదలు 11 వరకు నేను నీకొఱకు ప్రార్థించుచుండెద కావున ముఖ్యముగ నీవా గంటను నీ పరమతండ్రితో గడపుము. దేవుడు నిన్ను దీవించుగాక. “ ఈ మాటలైన పూర్తిగాకపూర్వమే

బండిరాగా ఎక్కి నే నిక్కడకు వచ్చితినిగాని నా తల్లిమాటల మరువలేదు. నేను మీతో రానను టకిదియే కారణము. నన్నిప్పుడు మీరేమైన జేయవచ్చును." అప్పు డా యేడుగురి కన్నులనుండి నీరు కారసాగెను. వారు తమ చీట్లపేకల నక్కడనే విడచిపెట్టిరి. సారాయిబుడ్ల పగులగొట్టిరి. వారా ప్రసాదరావు వెంట గుడికి వెళ్లిరి. అదినమే వారందరు మారుమనస్సు నొందిరి. మరెన్నడు సబ్బాతును అతిక్రమించ తెగించలేదు. వారు నారుగురు దేవునిపని చేసిరి. ఇంకొకరుకూడ రక్షణ నొందిరి. చూచితిరా! ఒక్క తల్లి ప్రార్థనవల్ల నెందరు రక్షింపబడిరో! ప్రార్థనబలము బహు గొప్పది. సబ్బాతును పరిశుద్ధముగ నాచరించుట మన ముఖ్యవిధులలో నొకటి.

---

# ఒక్క తల్లిమాత్రము

చుక్కలు పెక్కుగలవు. సముద్రపుదరిన చిప్పలు కుప్పలు కుప్పలుగా పడియున్నవి. పక్షులు సంఖ్యయందు నక్షత్రములవలె నున్నవి. సూర్యకాంతిలో సంచరించు తేనెటీగలు వేలకొలదిగ నున్నవి. ఉదయమున గడ్డిపై నుండు

హిమబిందువులకు లెక్కలేదు. గొర్రెలమందలు వేలకొలది గలవు. చక్కని సీతకోకచిలుకలు చాలవందలున్నవిగాని, ఈ లోకమంతటిలో తల్లి ఒక్కతెమాత్రమున్నది. ఆమెను, ఆమె బ్రతికియుండగా దయతోజూచి ప్రేమించుము.

---

## నేడే రక్షణపొందుము

ఇద్దరు యౌవనులొక కాలేజిలో చదువుచుండిరి. ఇద్దరును పాపమునుగూర్చి ఒప్పింపబడి రక్షింపబడుటకు యేమి చేయవలెనని ఆందోళపడిరి. వారిలో నొకడు ఇదే రక్షణ దినమని తెలిసికొని వెంటనే యేసుపాదములుపట్టి ఉత్తమ క్రైస్తవుడాయెను. రెండవవాడు, "కొంచెము ఆలస్యము చేసినను పర్వాలేదు. నేను చదువు ముగించినతరువాత నా పాపములను విడిచిపెట్టెద"నని ఆలస్యము చేసెను. అతడు పరీక్షలలో తేరినతరువాత దైవాత్మ తిరిగివచ్చి అతని మనస్సును తట్టిలేపినపుడు, "ఇంకా కొంచెము ఆలస్యముచేసి చూచెదను. వివాహమైనతరువాత బాగుపడెదను" అని ఆ పని వెనుకపడవేసెను. వివాహము చేసికొనుట ఆయెను. దేవుని ఆత్మ తిరిగి అతనికి పాపమునకువచ్చు దండననుగూర్చి జ్ఞాపకముచేసినప్పుడు అతడింకను ఆలస్యముచేసి, "నేనొక

ఉద్యోగముచూచుకొన బోవుచున్నాను. నేను ముందువచ్చి స్థితిమంతుడనైనపిమ్మట ఆలస్యముచేయక రక్షకునికి నన్ను నేను సమర్పించుకొందునని" చెప్పి వెనుకదీసెను. తరువాత అతని చూచి మాట్లాడినప్పుడు హృదయము కఠినమైనట్టు కనబడెను. ఏ మంచియాశగాని, పాపమునుగూర్చిన చింత గాని లేకుండెను. చూచితిరా, కాలయాపనవలన మనస్సు కఠినమైపోయెనుగదా? కావున, నేడే రక్షణదినమని మెల్ల వారు మరువకయుందురుగాక.

---

## ఆటలు

సీ. చిడుగుడు, దూబూచి - చిట్లపొట్లాకాయ
గుడుగుడు గుంచాలు - గూవనాలు
చీకటి మొటికిళ్లు - సిరిసింగణావత్తి
కుప్పిగంతులు, నెట్లు - కుందికాళ్లు
తూరనతుంకాలు - గీరనంగింజలు
గుజగుజరేకులు - గుంటచాళ్లు
పింపిళ్లు, కుచ్చెళ్లు - పిడిగ్రుద్దులాటలు
దాఁగిలిముచ్చులు - తన్ను బిల్ల
బొమ్మరా, లువ్వాల - పోటి వెన్నెలకుప్ప
లప్పళా, లాలంకు - లందలములు

పుట్టచెం, డ్లుప్పనఁ - బట్టె, లచ్చనగండ్లు
పిల్లదీపంబులు - బిల్లగోళ్లు
గంజనగా, లీనె - గాజులు, నాల్గుకం
బాలాట, బిట్లన - గోల, లాకు
పీఁకెలు, బొమ్మల - పెండ్లిండ్లు, నోమన
గుంటలు, గుజ్జెన - గూళ్లు, నంజి
తే. గీ. కోలక్రోఁతులు, గొబ్బిళ్లు - కుందెనగుడి
గ్రచ్చకాయలు, కనుమూసి - గంత, లల్లి
చిక్కనాబిల్ల, లొట్టిల్లు - చిందఱ యున
నొప్పునాటలపేళ్లయి - యుర్వియందు.

---

## ఎండ, గాలి, వాన

ఒక యుదయకాలమందు ఎండ, గాలియొద్దకు వచ్చి దానిని చూచి 'వందనమయ్యా' అని చెప్పెను. ఆ గాలి, యెండనుచూచి వందనమని చెప్పుటకు మిక్కిలి యాలస్యము చేసి, "నీవెందు కింత నిదానముగా లేచినావు? నేను రాత్రి యంతయు పనిచేసినా" నని చెప్పెను. ఇది విని యా యెండ, గాలినిచూచి "యూరకుండుము. తమ్ముఁడా! నేను రాత్రింబగళ్లు కలుగఁజేయుచున్నాను. కనుక నన్ను గెలిచేయ

వద్దు. నాకు సహాయముగా నీవును వానయును రావలయును. నీవుపోయి వానను పిలువు”మని చెప్పెను. ఇది విని యాగాలి,



వానయొద్దకుపోయి, నా యన్నయైన ఎండ నిన్ను రమ్మను మని చెప్పినాఁడని చెప్పెను. ఆ వాన, గాలినిచూచి “నేను పోయినపుడెల్ల ఎండ యెండిపొమ్మని చెప్పుచుండును గనుక నేను రాను” అనెను. గాలి, వాననుచూచి “మన మిద్దఱి మును తనకు సహాయము చేయుదుమని యాయన పలికెను.

గనుక మనము పోవలయు”నని చెప్పెను. ఆ యిద్దఱును కలసి వెళ్లిరి. అప్పుడా యిద్దఱును ఎండయొద్దకుపోయి వెంటనే నమస్కారము చేసిరి. ఎండ వారినిచూచి “మీ యిద్దఱును నాకు సహాయము మీయవలెను. ఒక తోఁటవాఁడు తన తోఁటలో మంచి పూవులచెట్టును నాటెను. నేను దానియొద్దకు పోయి యెంత యెండకాసినను, అది మొలవలేదు, గనుక మీరుపోయి మీ శక్తికొలఁది దానికి సహాయమీయవలెను” అనెను. అంతట వాన “నేను మొదటపోయి ప్రయత్నము చేసెద”నని వెళ్లిపోయెను. గాని యొక గంటసేపయిన వెనుక నేడ్చుచు నెండయొద్దకువచ్చి “ఆ చెట్టు నేను చాల తేమగా నున్నాను నాకొక గొడుగు కావలెనని చెప్పెను. అదివిని యక్కడ నున్నయెడల నాకు ప్రయోజనము లేదనుకొని తిరిగివచ్చి మీతో చెప్పుచున్నాను” అనెను. గాలి యెండనుచూచి నేను పోయెదననిచెప్పి వెళ్లిపోయెను. ఐదు నిమిషములయిన తరువాత ఆ గాలి కేకలువేయుచు సంతోషముతో నెండయొద్దకు తిరిగివచ్చి “ఆచెట్టు మొలచిన”దని చెప్పెను. ఎండ, గాలినిచూచి “ఏలాగు? ఏమిచేసినా”వని యడిగెను. ఆ గాలి యెండనుచూచి “మీ యిద్దఱును శాంతముతోను దయతోను దానికి సహాయముచేయఁ జూచితిరి. నేనుపోయి దానిని కొట్టికొట్టి సహాయమిచ్చితిని” అనెను.

కోపము చూపింప నక్కఱలేకుండ, పనిచేసెడి పిల్లలు మీలో నున్నారా? తల్లిదండ్రులు "ఇది చేయవలెను, అది చేయవలెను" అని దయతో చెప్పినయెడల మీరు చేసెదరా?

---

# ప్రకృతి పాఠములు

### 36 వ-పాఠము

## కండరములు

ఇదివరకు కండరములనుగూర్చి కొంచెముగా చెప్పియుంటిని. కండరములనగా నేమో తెలియునా? సాధారణముగా వీనినే కండలందురుగాని కండరములను పేరు నేర్చుకొనుట మంచిది. శరీరములోని ప్రతిచలనమును (కదలిక) ఈ కండరముల సహాయమువలన జరుగును. ఎముకలను మాత్రమేగాక, నాలుక, పెదవులు, కండ్లు, రెప్పలు మొదలగు బహు చిన్న అవయవముల కదలికయు కండరముల వలననే సాగుచున్నది.

ఇదేలాగు జరుగుచున్నదో తెలియునా? రబ్బరుముక్క నొకదాని రెండు చివరలను పట్టుకొని లాగినయెడల సాగును గదా! దాని విడువగానే యేమిజరుగును? ముడుచుకొనును.



కండరము ఎముకను లాగునప్పుడు అది ముడుచుకొనును. గాని ఇట్లు ముడుచుకొనుటకు కారణము వేరుగానున్నది మనస్సువలన ఈపని జరుగును. మెదడునుండి బయలుదేరి అన్ని కండరములగుండ వ్యాపించు నాడులద్వారా కండరములకు మనస్సునుండి కబురు రాగానే ఈ పనులు మెరపు వంటి వేగముతో జరుగుచుండును.

ఏ కండరమైనను ముడుచుకొనునప్పుడు లావయి, గట్టిగా నగును. నీ చేతినిచాపి, దండచేతిదగ్గర పట్టుకొని చాపిన చేతిని మోచేతివద్ద వంచుము, వెంటనే ఎదుటనున్న కండరము లావయి, బహు గట్టిగానున్నట్లు కనుపడును.

శరీరమందలి కండరములే మాంసపు భాగమైయున్నవి. జంతువుల మాంసమంతయు కండరమయమై యున్నవి. అన్ని జంతువుల మాంసము ఒకటే రంగుగలదికాదు. ఎద్దుమాంసము ఎర్రగానుండును. కోడిమాంసము అంత ఎర్రగా నుండదు. చేపలమాంసము, చాలవరకు తెలుపుగా నుండును.

మోచేతికి దిగువను అనేక కండరములు గలవు. చేతిప్రేళ్లను అటుయిటుకదల్చు కండరములన్నియు అచ్చటనే గలవు.

---

# మోక్షము

ఒకసారి ఒక క్రైస్తవపంతులమ్మ చిన్నికూతురు చనిపోయెను. అప్పుడామె, ఆ చిన్నిబిడ్డ శవమును చక్కగా కడిగి, మంచిబట్టలువేసెను. ఆ బిడ్డయొక్క నల్లని వెంట్రుకలను చక్కగా దువ్వి పాపటదీసెను. ఆమె చిన్ని ముద్దుచేతులలో మల్లెపూవుల చెండొకటి పెట్టి, తన పొరుగుననున్న హిందూ స్త్రీలను చూచుటకు రమ్మని పిలిచెను. వారా బిడ్డను

చూచి ఎంతో ముచ్చటపడిరి. వారికి దుఃఖమాగక పోయెను.
"అమ్మా! ఎక్కడికో మంచి స్థలమునకు బోవునట్లు నీ పిల్లను శృంగారించితివేమమ్మా? నీ పిల్లను మళ్లీ చూచెదవా? మా బిడ్డలు చనిపోతే వాళ్లను తీసికొనిపోయి గుంటలో పారేస్తాము. నక్కలో కుక్కలో పెరుక్కు తింటాయి. వారు చీకటిలోకి పోయినారు. మళ్లి రారుగదా. అయితే ఇంత బాగా అలంకరించినావు గదా. మీబిడ్డను పిలుచుకొన్న యేసుక్రీస్తును గూర్చి మాకును చెప్పుము. ఆమెను అంత బాగా కాపాడి నీవుకూడా అక్కడకు పోయినప్పుడు మళ్లీ ఆ బిడ్డను నీకిస్తాడా! అంత మంచి మతమమ్మా మీది" అని చెప్పిరి.

ఆ పంతులమ్మ తన రక్షకునిగూర్చి వారికి బోధించుటకెంతమంచి అనుకూల సమయము. ఆమె యేసుప్రభువు బిడ్డలంటే ఎంత యిష్టమో చెప్పెను. ఆయన వారి నుంచు మోక్ష మెంత శృంగారమైనదో తెలిపెను. తా నెప్పుడు అప్పుడు చెప్పినంత మంచిబోధ చేయలేదట.

"ఆయన వారికన్నుల ప్రతిబాష్ప బిందువును తుడిచివేయును. మరణము ఇకమీదట నుండదు. దుఃఖమైనను ఏడ్పైనను వేదనయైనను ఇక నుండదు. మొదటి సంగతులు గతించిపోయెనా."

---

# బైబిలు పిల్లలు

## సౌలు

బాలమిత్రులారా! ఈ సౌలు రాజు చరిత్రము మీ కెరుగుదురా? ఇతనినే సమూయేలు ప్రవక్త మొదటి దైవజనులగు ఇశ్రాయేలీయులకు రాజుగా నభిషేకించెను. ఇశ్రాయేలీయులు ఇతర జనాంగములకు రాజులుండుటజూచి తమకును ఒక రాజు కావలెనని పట్టుపట్టి యడిగిరి. దేవుడు వారికి రాజువలన తొందర గలుగునని యెన్ని విధముల హితోపదేశములు జేసినను వినక పదేపదే యడిగినందున వారికి చివరకు రాజు నిచ్చెను. ప్రభువు సమస్తము మన యొక్క మేలునకు అనుగ్రహించును. మన మడుగు వరములన్నియు ప్రభువుదృష్టికి సరిగానుంటే ఆయన వానిని తప్పక మనకిచ్చును. ఎడతెగక ప్రార్థించుట మంచిదియేగాని దేవుని చిత్తమైతే నీవడుగుకొను వరమిమ్మని ప్రార్థించ మరవకుము. మనలో చాలమందేమి తెలియక అనేకసార్లు మన కీడునకనేక ఈవుల నడుగుకొందుము. అయితే సమస్తము యోచించి ప్రతివాని మేలునెరిగి పాలించు ప్రభువు వాని పొందుటకు తగిన సమయముననే మనము కోరుకొన్న

ఈవుల నిచ్చును. ఆయన త్వరపడడు. గనుక పిల్లలారా! ఇశ్రాయేలీయులవలె పట్టిన పట్టు విడువక మేము కోరినదే కావలెనని నన్నిటి నడుగకుడి. సౌలు రాజు మొదట చాలా మంచివాడుగాను విధేయత గలవాడుగా నుండెను గాని ఆ తర్వాత వాని చరిత్ర చాల వ్యసనకరమని చదువుదుము.

(సశేషము)

---

# బాలమిత్ర టపా

ప్రియ బాలమిత్రులారా!

ఈ సంవత్సరము నంద్యాలకు ఉపద్రవము కలిగెను. అదెట్లనిన, నంద్యాల చుట్టు నదులున్నవి. తూర్పున రెండు పెద్దచెరువు లున్నవి. ఇవి నంద్యాలకంటె యెత్తుగా కట్టబడి యున్నవి. అయితే నంద్యాల తగ్గుగా కట్టబడియున్నది. నంద్యాలచుట్టును నీరు యున్నందున ఒక ద్వీపమువలె యుండెను. గడచిన నెలలో 12 అంగుళముల వానకురిసెను. మరియు 29 తేది మొదలు 31 తేది వరకు వాన కురిసినందున, 36 గంటలలో 10 అంగుళముల వానకురిసెను. గనుక నంద్యాలచుట్టు నీరు పొర్లిపారెను. దక్షిణమున నుండిన యిండ్లును, మనుష్యులును, కొట్టుకొనిపోయెను. ఉత్తరముననున్న యిండ్లును, మనుష్యులు, పశువులు, కొట్టుకొనిపోయెను. మరియు రాళ్లతోను, మట్టితోను, కట్టబడిన కొన్నిమిద్దెలు క్రింద పడిపోయెను. తంతిసమాచారము తెలియచేయు తీగెలు, వాటి స్థంభములు పడిపోయెను. 30 యవ తేదిన




నంద్యాలకు తూర్పునయున్న కెనాలుకు నీళ్లు అధికముగా వచ్చినందున దాని కట్టలు తెగిపోయెను. మరియు సర్కారువారు చెరువుకట్టలను తెగగొట్టినందున నీరు కుందునది లోనికి దాని ఉపనదియైన చామ కాలువలోనికి వచ్చినందున నదులన్నియు యేకమైపారెను. మరియు రైలుమార్గము చెడిపోయినందున యంత్రము (ఇంజన్) క్రింద పడిపోయెను. గనుక యంత్రశోధకు లిద్దరు కొంత దూరము కొట్టుకొనిపోయి దైవసహాయమువల్ల వారిద్దరు తప్పించబడి సుఖముగా టానా (స్టేషన్) చేరిరి. ఇట్లు నాలుగు రోజులవరకు రైలుబండ్లు గాని, తంతి సమాచారముగాని, నడువలేదు. ఇప్పటికిమాత్రము దైవసహాయము వలన క్షేమముగా యున్నాము.

ఆర్. బెన్నయ్య
నంద్యాలు

---

C. L. S. PRESS, MADRAS—1917